

# క్రొత్త రాగం



—మణిమొల నాగేశ్వర్రావ్.

ప్రచురణ:

రాజా పబ్లికేషన్స్,

13/107 జగన్నాథపురం

గుడివాడ కృష్ణాజిల్లా (ఎ. పి.)

# పరిచయం

ఆంధ్రసాహిత్యంలో భావకవిత్వం ఒక మహోద్యమంగా విజృంభించిన తరవాత కవులదృష్టి రాజాస్థానాలనూ, సంకీర్ణ నాగరిక జీవితాన్నీ వదిలిపెట్టి ప్రశాంతమైన గ్రామసీమలవైపు ప్రసరించింది. అందమైన పల్లెలలో ఆనందంగా జీవించే పేదరైతుల బతుకులను చిత్రించటానికి కవులు పూనుకున్నారు.

ఈ పరిణామానికి దువ్వూరి రామిరెడ్డిగారి కావ్యం "కృషీవలుడు" నాంది పలికింది. గేయకవిత్రయమని ప్రశంసించదగిన బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, అడివి బాపిరాజు సామాన్యజనులు పాడుకునే వరసల్లో వాడుకునేతేనెమాటల్లో కర్షకజీవితాలలోని లలితశృంగారాన్నీ సరళహృదయాలలో మెదిలే కోమలభావాలనూ, ఆశా నిరాశలనూ, సుకుమారంగా, స్మరణీయంగా చిత్రణచేశారు. ఎంకీనాయుడుబావల ప్రణయాన్ని ఉదాత్తభావాలతో మధురమైన శైలిలో పాటలుగా నండూరి తీర్చిదిద్దారు. అదే మార్గంలో పయనించి కొనకళ్ళ వెంకటరత్నం బంగారిమామ పాటలు రాశారు.

ఇన్నాళ్ళకు శ్రీ నాగేశ్వరరావ్‌గారి "రైతురాగం" చదువుతుంటే ఆ సత్కవుల సరసన సగర్వంగా నిలవదగిన రచన చేశారనే ఆనందమూ సంతృప్తీ కలుగుతున్నాయి. పాడటానికి అనువైన రచనా విన్యాసం. సులువైన మాటల్లో విలువైనభావాలు పలికించగల చాతుర్యం. పదకవితకు ప్రాణసమానమైన మాధుర్యం, సంయమనం. అల్పాక్షరాలతో అనల్పమైన శబ్దచిత్రాలను కళ్ళకు కట్టించే నైపుణ్యం. కేవలం నినాదమే కవిత్వం కాదు. ఆవేశంతో అనుభూతితో రంగరించినప్పుడే వాస్తవాలు కావ్యవస్తువులై శబ్దాలు రసాబ్దాలు కాగలవు.

# II

ప్రబోధాత్మకంగా సాగిన రెండుమూడింటిని మినహాయిస్తే "రైతు రాగం" లోవున్న ఖండికలు భావస్ఫురణతో సుకుమార సుందర రూపంతో అలరారుతున్నవి

మట్టిలోంచి బంగారం వెలువరించే రైతుకు మట్టిమీద మమకారం ఎందుకో "అన్నప్రాసన" గేయంలో అపూర్వంగా చెప్పారు.

"మన్ను తిన్నది మమ్మ
వేవిళ్లకై కాదు
కడుపులోనే నాకు
అన్నప్రాసన సాకు"

ప్రకృతి దృశ్యాలను సొంత కళ్ళతో చూసి సొంత గొంతుతో వినిపించటంలో కవి విశిష్టత గోచరిస్తుంది.

"సుడిగాలి వాటులో, జొన్న పెనగుతువుంటె
కన్నకడుపూ భూమిఁ, దుమ్మెత్తిపోసింది"
"రేయి గుండెన వూరు, పక్క చుడతావుంది
బళ్లు విరిచిన తీరు, చప్పుడవుతావుంది"

శృంగారభావాల ప్రకటనలో పచ్చిదనంలేని వెచ్చదనం సాధించారు నాగేశ్వరావ్‌గారు.

"నెలవంకలా కళ్లు, ఉలులు సోకిన వొళ్ళు"
"గుండె కాజేసింది, నిప్పు రాజేసింది"
"సిగ్గుమొగ్గలు వేసె, సెక్కిళ్ళ గుంటలు
నవ్వేలే పువ్వులు, నా పిల్ల సొమ్ములు"

III

రైతుల జీవితాల్లో కాంతి కాంతి సంక్రాంతి ఇంకెప్పుడు వస్తుందో అని ఆశాభావంతో నిరీక్షిస్తున్నారు కవి.

> "అశరీరవాణి
>
> నా బాణి
>
> నిత్యకళ్యాణి
>
> నా మాగాణి"

అంటూ సాహిత్యక్షేత్రాన్ని తన కలంతో హలంలాగా దున్ని నవ ధాన్యాలు పండించగల కవి కర్షకుడు నాగేశ్వర్రావ్‌గారు.

ఆయన లేఖిని ఇంకా పదునెక్కి ఆయన హృదయం మరింత రసార్ద్రమై ఆయన భావన ఇంకా ఉన్నత శిఖరాలు ఆరోహించి ముందు ముందు ఇంకెన్నో తేనెలూరే తేటపాటలు తెలుగువారికి అందించాలని నా ఆకాంక్ష. తొలికావ్యంలో విరిసిన ఇంపుసొంపులకు మురిసిన నాకు ఆయన గేయకవిగా విశిష్టస్థానం సంపాదించుకోగలరనే విశ్వాసం.

—అమరేంద్ర



# అంకితం

ముగ్గురమ్మలకే:

రావమ్మ

రత్తమ్మ

అత్తమ్మ



# విఘ్నేశ్వర ప్రశంస

ఎలుక నెక్కావులే
చిక్కు తీరా నాకు!
అమ్మకైనా చెప్పి
బసవన్న విష్ణు !
పంటపై ప్రాణాలు
పెట్టుకున్నా నని
ఆకు అలమూ యేరి
కోరు కున్నావా ?
ఆశ లీనే కసవు
బాస లేనీ పశువు
చవితి చంద్రుని కాంచ
అచ్చు కుంటావా ?
ఏడాది కో పూట
నీకు పెడితే పోదు !
ఏళ్లెల్ల పాడినా
ఎంత మందో చూడు !

---

# యక్ష ప్రశ్న



ఎవరిదో యీనింగి ?

ఎవరిదో యీనేల ?

పిట్ట గూడెట్టింది

మనిషి మేడేసింది !

కొండ కూసున్నది

సాగరం పడుకుంది !

మేఘాలు తిరిగేది

గాలి కౌగిటిది !

సూరన్నదా లేక

చంద్రన్నదా ?

వీరన్నదా లేక

మీరన్నదా ?

ఈ నింగి ఈ నేల

ఎవరిదో ? ఎవరిదో ?

ధర్మజుడు వోడేది !

మృత్యువే మింగేది !

# భూదేవి స్తోత్రం

వేదాల నడిగాను

భూదేవి మల్లీ

భూతమ్ము లన్నింట

నీవు మిన్నే నంట !

పాదాలు కడిగాను

నదుల నీరాపి

మబ్బులను ముడి పెట్టి

గుడి కట్టినాను !

కాలేదు కదతాను

కదలకే తల్లీ !

ఈత కొచ్చిన పంట

పడకుండ యే కంట !

హారతిదె పడతాను

భారతిని చూపి

నిప్పు గుప్పెట పట్టి

కొడిగట్టి నీను !

# నా తెలుగు తల్లి

జనమ జనమను
నేను నీకె పుట్టాలని
కలలు కనుకున్నానె
నా తెలుగు తల్లి !
గోదావరీ క్రిష్ణ
తుంగభద్రా పెన్న
నీళ్ళ పాతళ్ళమ్మ
నా తెలుగు తల్లి !
నన్నయ్య త్యాగయ్య
సిద్ధేంద్ర శిల్పేంద్ర
కళల లోగిళ్ళమ్మ
నా తెలుగు తల్లి !
శ్రీముఖ బ్రహ్మన్న
మల్లమ్మ రుద్రమ్మ
కనగ దుర్గమ్మ వే
నా తెలుగు తల్లి !



# సిరి పురం



సిరి పురమ్మా లోన
చింతేవిఁ టమ్మా?
ఇంటింట గరిశెలు
కుండల్లో అరిశెలు!
పచ్చి బాలింతగా
గో మాత వుంది!
కోడి పెట్టా పురుడు
పోసు కుంటంది!
రెండు గాళ్ళెద్దులు
చరగన్ని హాద్దులు!
నిమ్మ చెట్టూ వుంది
 దానెమ్మా వుంది!
గుడి వుంది, బడి వుంది
చెఱువు, సత్రం వుంది!
అందరూ రైతులే
ఆనంద చరితులు!

# భువనైక

ఊరు సుట్టూ సుట్టి
వాగు పడ గిప్పింది !
ఊరిలో నాగన్న
ఇల్లు మావిడి గున్న !
మొండి కొండా కాదు
మండవా లోగిలి !
బసవన్న మొగసాల
బావిలో గంగా !
కాకి నెవిలీ డేగ
పొదుగు కుమ్మే లేగ !
పురుల వావుల నీడ
దోగాడు సిరులు !
గొఱ్ఱె మేకా గేదె
ఆవు అంబా అరులు !
బళ్లనాగళ్ల పై
అరటి కొబ్బరి తరులు !

# సుప్రభాతం

కోడి కూసింది రా!

కాకి లేసింది !

కవ్వ మాడింది రా !

రోలు పాడింది !

వెన్నెలా ముద్దోయి

వెన్న ముద్దోయి

కోటేరు పన్నగా

కునుకు ముద్దోయి !

రేయి గుండెన వూరు

పక్క చుడతా వుంది

ఒళ్ళు విరిచిన తీరు

చప్పు డవుతా వుంది !

వెన్నెల్లో వెలుతురు

కలిసి పోతా వుంది !

తుమ్మల్లో బొమ్మలా

ముసుగు లాగింది రా !

# రైతు



ఇంతటి బ్రతుకు
ఇల్లో వుందని
రాదులె కొందరి
కల్లో కైనా!

పంగలి కొయ్యను
నాగలి చేసి
ఆకలి కాసిన
వైతాళికుడు!

జంతువు చూసి
మచ్చిక చేసి
మొడ కాడేసిన
యాంత్రికుడు!

తంతూ తిరిగే
భూమిని దుంతూ
చెలి బట్టాడు
ధర్మ గట్టాడు!



# పోరాటం



నర నరాలు ముళ్లేసుక
తర తరాలు వల్లేసుక
ఎద్దుల్ని మళ్లేసుక
పోతున్నా పొలానికి !
సూర్యుడికే ముసు గేసిన
కోట మంచు చలిమిరి గోని
నీటంచున రేగడిలా
పోతున్నా పొలానికి !
నెత్తురు జల గొట్టుకోను
సత్తువ వెల గట్టుకోను
ఆకలి మెడ పట్టుకోను
పోతున్నా పొలానికి !
అట్టుడికే యెండన పడి
పొయ్యి పైన మసలు తున్న
పాల పైని మీగడి లా
పోతున్నా పొలానికి !



# ఆడ గూతురు

మొరక చేనికి నేను
అర కేసు కెలితేను
అక్కడికే ఆడది
కూడు తేవాలి !
గొఱ్ఱు నే పడుతుంటె
ఆలి యెద పెడుతుంటె
దారి నెళ్లే వాడి
కళ్లుగుట్టాలి !
నెయ్యి కారము వేసి
తైద ముద్దా చేసి
నంజు కొమ్మన గుడ్డు
పుంజు కుంటాను !
ఆడ గూతురు అండ
దండిగా నా కుండ
కన్న కడుపుకు నేను
దండ వెఁడుతున్నాను !

# తిథి నక్షత్రాలు

తొలకరిలో ఒక జల్లు
చిలకరించుకు వెల్ల
మట్టి కరిగిన, సు
వాసనలో పుట్టాను !
ఎక్కడిదో ఓ పాట
గాలి కలిసే చోట
ఇంటి కెళ్ళే దూడ
గంట మోగింది !
వడిగళ్ళ ముత్యాలు
ఎనలేని సత్యాలు
మట్టిలోనే కలిసి
చాటి పోయిన వట్టె !
రంకేసి ముసిలెద్దు
కాలు దువ్విన వేళ
చేలోనె పుట్టాను
తొలి రెప్ప కొట్టాను !

# అన్నప్రాసన

అమ్మ కడుపున వూడి

పుడమి పై పడ్డాను !

ఒత్తు కున్నా తల్లి

ఎత్తు కున్నట్టుంది !

మన్ను తిన్నది మమ్మ

వేపిళ్లకై కాదు !

కడుపు లోనే నాకు

అన్న ప్రాసన సాకు !

అంత కమ్మని భూమి

కౌగిలింతింకేమి ?

ఈసారి పొల మెల్లి

దుక్కి లో దొర్లాలి !

పుట్ట చెట్టూ నీడ

పూలు రాలే కాడ

నాగు తిరిగే జాడ

నే గాలి మేయాలి !

---

# అన్నపూర్ణ

పొద్దునే బొట్టెట్టి
కడలి అద్దం సూసి
భూదేవి కొప్పులో
కంకి తురిమింది !
ఋతువులు చీరెలు
రేయి పగలే నగలు !
ఏ జేముకో రాణి
వెన్నె లంతా వగలు !
సంధ్య ఛాయల మల్లె
ముద్దబంతీ వోల్లు
అన్న పూర్ణంటేనె
నోరూరు తుంట !
పొద్దు పోయే దాక
నేల సొగసులు సూసి
నింగి నెలబాలుణ్ణి
సంకేసు కుంది!

# పోటీలు



ఆ వచ్చేది
రైతు బిడ్డలు
అందరివీ, నీతు
కావి గుడ్డలు !
పరికిస్తున్నారు
పైరు, ఖడ్గాలు
ఝళిపిస్తున్నారు
చేతి కఱ్ఱలు !
కడుతున్నారు
పంట దిగుబడి
పెడుతున్నారు
ఊరి కొరవడి !
ఎంత బావుంది
వారి చందం !
పడుతున్నారు
ఏదో పందెం !



# పెత్తందార్లు



పాల బట్టల దూడ !

యల్ల వన్నెల కోడె !

కాడి కలిపితే చాలు

కనకాభిషేకాలు !

పట్టండి రాజాలు

బండి కిటకిట లాడ

మెచ్చాలి పోట్టేలు

అరగాలి పట్టాలు !

ఉరకండి వడి వడిగ

పురుగు పుట్రా వుంటె

డొలుపు కిందే వుండి

కావంగ మన కుక్క !

చాలింక పోకిళ్లు

ఉడికుండు గుగ్గిళ్ళు !

అమ్మ పిలుపదిగోను

మలుపు తిరగండి !



# సుడిగాలి

సుడిగాలి వాటులో
జొన్న పెనుగుత వుంటె
కన్న కడుపూ భూమిఁ
దుమ్మెత్తి పోసింది !
కళ్లు కనబడ కేవోఁ
సుళ్లు తిరుగుత వుంటె
జుట్లు ముడిలిడి పోయి
శెట్లు శివ మెత్తాఁయి !
ఆకులు శాకులు
ఒగుడాకు యీకలు
నింగిలో రంకులా
రాటు వేఁశ్యాయి !
ఈపు సీప్రురు దెబ్బ
దుమ్ము దూపం తోటి
గాలి గుమ్మట వెఁల్లె
శదలేటి కేసి !

# చంద్రుడు



చదువు కున్నావాణ్ణి
సంస్కార మున్నోణ్ణి !
కలము హాలములుగన్న
కులము వాణ్ణీ నేను !
నా చేను పూసింది
పుష్ప రాగములు !
బంతిపూలూ చూసి
చుక్కల్లు సిగ్గిల్లె !
నా చేల వెలుగుల్లో
ఈ పూల నవ్వుల్లో
మంచె కట్టీ నేను
చంద్రుణ్ణి అయినాను !
గ్రహణాలు లేకేమి ?
అతి వృష్టి మృతి వృష్టి
అనుకుంటె అమవాస
కాటకమ్మే నాకు !

# అమాయకుడు

చందమామలో చెట్టు
నాటింది నేను రా !
సూర్యుడంటే గొడుగు
పట్టింది నేను రా !
చంద్రుడంటే యెవడు ?
సూర్యుడంటే యెవడు ?
నా కుంటలో నీళ్లు
తాగి పోయే వాళ్ళె !
ఆకలేసీ వాళ్ళు
ఎంత కేకిడ పోతె
నా గింజలతో మీరు
నైవేద్య మిడతారు !
లోకాలు యేలేటి
కిరీటమే నేను !
నాకు యెండే కాక
నీడెలా వుంటుంది ?



# వాస్తు శాస్త్రం

ఇవి నా విధులు
అయినా నిధులు !
పడితే బదులు
కడితే వొదులు !
చేనికి మంచ
చుట్టూ కంచ
తలగడ బావి
నిలబడ మావి !
ఇంటికి అరుగు
అంటిన పొరుగు
ఊడని బెరడు
కూడిన పెరడు !
అరకా చరఖా
ఆవూ మ్యావూ
కుక్కా కోడి
ఒక్కటి చాలదు !



# ముల్లు గర్ర

కర్ర లేనీ వాని
గొర్రె కరిచేను !
చేత కర్రా లేదు
రైతు నంటాడు !
శివు నంతటీ వాడు
శూలమ్ము పట్టేను
ముద్దు ముద్దుగ నంది
నదలించు కోను !
ఎద్దులను గిల్లినా
హద్దులను కొలిచేను !
ముల్లు గర్రే కాదు
అది రైతు విల్లు !
ముల్లు గర్రతో రైతు
మూర్తీభ వించాలి !
ఫాలాక్షుడే డోయి !
పట్టి చూస్తా ననగ !



# నా భూమి

ఈ భూమి ! నా భూమి !
మబ్బు లేలే భూమి !
ఒక్క తడి కడితేనె
పిడుగు రాలే భూమి !
లోక మెరుగని యీాడు
దోగాడు నాడే
అన్నానికి మున్నె
నిన్నె తిన్నా మన్నుఁ !
ఎన్ని చదువులు వున్న
ఏ కొలువు కొలిచినా
నిన్ను విడిచీ నేను
సామెలా చేసేను ?
నమ్మకున్నా దమ్మ !
నాకు నచ్చిన సొమ్మ !
నీ కడుపులో నుంచి
నిధులు వెల వాలమ్మ !



# ఏరువాక

సాగాను ! సాగాను !

ఏరువాకా నేను !

ఊరూరు కదిలింది

భూమాత మెదిలింది !

విత్తులను యెండేసి

గిత్తలకు రంగేసి

ఇల్లాలు యెదురైన

యెల్లాలి పొలము !

కాలువలు త్రవ్వినా

మన మెంత క్రొవ్వినా

అమ్మోరి గుడి కాడ

అరక నిలవెయ్యాలి !

ఈనాటు వోనాడు

మేడి మొలకేసింది !

తొలి చాలుకే నేడు

సీతమ్మ దొరకాలి !

# అమరగానం



దోరెండలో కొండ
కొండ దాలిన బండి
బండిలో సిన్నోడు
పాడు తున్నాడు !
మువ్వాలూ గంటలూ
పక్క వాయిద్యాలు
ఎంచక్క మోగాయి
ఎడ్ల నడకల్లో !
కుదుపులే మద్దెల
ఇరుసు కిసకిస బూర
కొండ కొమ్ముల గూడు
బండి పోయే పల్లె !
కాన గోలను మింగి
పాట తేనెలు తాగి
ఏరు కౌగిలి చేర
కునికింది లోయ !



# యల్లిగిత్త

తెల్ల తెల్లని దూడ

కల్లు లేని కోడె !

సుళ్ళేమిటో గాని

సల్లెక్కడా లేదు !

వరదైన బురదైన

ఒళ్ళు దాచని దూడ !

కళ్ళు వురిమా డంటె

బళ్ళు డిగబడ వింక !

తెనాలి వీధుల్లో

వినాలి వీడి కథ ;

పందెంలో గెలిచాడు

మనిషిలా నిలిచాడు !

కాలెక్క డిరిగేనో ?

కొమ్మెక్క డిరిగేనో ?

బీటిలో వాడిలానో

పోటీల కెలతాడు !

# పుల్లగిత్త



పాల బట్టల దూడ
అంగ వైఖరి చూడ
నంది కేశుడు గూడ
తలదించు కుంటాడు !
రమ్మంటె వస్తాడు
పొమ్మంటె పోతాడు !
తెలిసి నట్టే యేదో
తల తిప్పుతుంటాడు !
ఏ పొద్దు లోనైన
ఏది చప్పుడు అయిన
బుసకొట్టుతూ తాను
పసిగట్టి పెడతాడు !
నేవూరు వెళ్లానో
వీడిదే దిగులంత
వచ్చి వేసే దాక
నోట పట్టడు మేత !

# దారెంట



ఊళ్లోన వుంటేను
ఊపి రాడదురా !
పొలాని కెల్లాల
పాలు పోవాల !
సాకిరేవూ కాడ
సక్కన్ని వోసిలక
కండల్ని కట్టేసి
గుండెల్లో దాసింది !
కాల్లాడకా యేరు
సుళ్ళు తిరిగింది !
పిల్ల గాలికి వొల్లు
సలపరించింది !
యేటి నురగలు సూసి
మెల మెలా బోతుండె
గట్టుపై గోరింక
నింగిలో నెలవొంక !



# కాపు

◆◆◆◆

దొంగ పసి కట్టేది
నా పుల్ల గిత్త
పైన పడి పొడిచేది
నా గొఱ్ఱె పోతు !
దోర వయసు కోర చూపు
పిల్ల పేరు మల్లెమొగ్గ !
తలబిరుసు నోరు దురుసు
అమ్మడి నడువుఁ గుమ్మడి తొడెవుఁ !
పాడుకుంటే తన కేంటో ?
ఉలుకెల్ల యల్ల బోసి
గిల్ల బోతే ముద్దబంతి
గుమ్మడి పైన గొఱ్ఱెకుమ్మొ !
విరగబడి తిరగబడి
రైకముడి కోక చెడి
జాంపళ్లోయ్ ! గుమ్మడి కాయలు !
గుమ్మడి పళ్లోయ్ ! జాంకాయలు !

# సూ ప రి



జంట కడదా వంట
కంట సూపెట్టింది !
నెల వొంకలా కళ్ళు
ఉలులు సోకిన వొళ్లు !
సేని కెన్నడు రాదు
దారి కొచ్చే సోకు !
సెలువు కెప్పుడు రాదు
యీ దెంత నాజూకు !
నా వయసులా నీదు
మనసుకూ సోనీదు !
కాళ్లు సేనికి లాగ
సెలువామె కళ్లు !
మొద తీపి కోతలో
మోపెత్తనే లేదు !
కడసారి సూపంది
కడవెత్త బోతే !



# మూ గ మ న సు లు

అందాలు మాటల్లో

మూట గట్టే వేళ

తుమ్మ మొద్దున తొండ

కొంటె బంధాలు !

వాగు వొంకల్లోన

ఒళ్ళిరుచు కుంటుంటె

కొసిరి కొసిరీ గువ్వ

కూని రాగాలు !

వాగొడ్డు తుమ్మలు

ఎరగనట్టే ముసిరి

ఒక్కొక్కటే విసురు

నీలపై పూలు !

మెల్లగా వాగెల్ల

చెలువు గుండెలు పూరు

ఆకాశమే వొంగి

అరగన్ను వేసి !



# గుండె గోడు

గుండె కాజేసింది

నిప్పు రాజేసింది !

కోకిలై కూసింది

కొంప తీసింది !

నింగి దీపం బెట్ట

గాలి వీవన లీసె

నేల జోల పాడ

నిదరెట్ట దాయె !

తెల్లారి పోయింది

బోసి కోడతా వుంది

గుండె లేని గూడు

అకురాలిన మోడు !

అమ్మ నవ్వుతోంది

ఆవు లా వుంది !

మొనకెవ్వరో దాగి

తొంగి సూశారు !

# వసంతాకృతి

మనసులో నాకేదో

ఊసు వొస్తంటది

శెట్టునో శామనో

సూసి నట్టుంటది !

యేటి వొడ్డున యీత

జుట్టు యిరబోసింది !

యేటి నీటిలొ సోకు

సూసుకుంటంది !

యేరు నవ్వింనేవొ

గల గలా యినపడది !

సంద్రానికీ యింత

సెప్పి నవ్విస్తది !

యిడి సేసి గుడ్డలు

శెట్లు నిలబడ్డయ్యి !

యెన్నెల్లొ ఆకులు

వుత కేసుకున్నయ్యి !

---

# మ డి సి



కలకాదు సెప్పేది
పచ్చి నిజవంటాది !
గుండె సేతికి తీసి
ఆడుకుంటాది !
తల సుట్టె కనికట్టు
కట్టె మెడప్పై బట్ట !
కిట్టు సెప్పలేవు
కట్టె వేణువు కాదు !
కంట బడ్డా నంట
గట్టు నోచ్చే యేల !
తనువు లోతులన్ని
తవిఁడి నట్టుందంట !
నీ ఆలికా పోతె
ఏటికే బతుకంది !
కల్లోకి మెల్లి నే
కోల్ల గొట్టానంట !

# ఇంటిదారి

కొండల్లో పొద్దు పడింది
గుండెల్లో ముద్దాడింది !
ఇంటిగాలి వొంటికి సోకి
పైరగాలి లీలలు సాగి !
చేలల్లో సిరిగర లాడి
తోకలేపి గెంతగ దూడ
గొర్ల మంద బెదిరిందోయి !
డొంక గట్ల పొర్లిందోయి !
దారులన్ని కోటేరులతో
పాముల్లా పరుగెడుతుంటే
మబ్బులన్ని లేబిట్టలతో
వాముల్లా వెనకడ్డాయి !
మెళ్ళల్లో గంటలు మోగి
ఇళ్ళల్లో దీపా లెలిగి
దారి కళ్ళు మూసిందోయి !
ఊరు కళ్ళు తెరిసిందోయి !

---

# తే నె సి ని కు లు

జంట పిట్టల మల్లె
శెట్టు లెక్కాలంట !
సెలయేట జలకాలు
ఆడుకోవాలంట !
గాలి తగలాలంట
ఊపిరాడ్డాలంట !
శెట్టుల్లో గుట్టల్లో
పండు కోవాలంట !
సిగ్గు మొగ్గలు వేసె
సెక్కిళ్ల గుంటలు !
నవ్వులే పువ్వులు
నా పిల్ల సొమ్ములు !
నేల నవ్వాలంట
నింగి సూడ్డాలంట !
సేల కవుగిళ్లలో
శెట్లు వూగాలంట !

# నేలపగులు

ఒడల్లె వూడల మర్రి

దాని కింద వాడూ నేను

వాడంటే జతగాడు

వాడు లాడుతున్నాడు

జల జల చినుకులు

రాలేటప్పుడు

భూదేవి పులకించిందంట !

గడ్డి నిక్క బొడిచిందంట !

భూమి నెత్తు కెల్లాలని

సుడిగాలి వొచ్చాడంట

భూదేవి అలివి గాక

వాన తన్ను కెల్లాఁడంట !

కిఱ్ఱుమని భూదేవి

నెత్తి గొట్టిందంట !

వాన దేవుడంట

భూదేవి మొగుడంట !



# అంకితాలు



అన్నయిన అబ్బయిన
అన్ని నేనే నంట !
సెల్లెయిన తల్లెయిన
యెన్నెన్నో తానంట !
యిడ లేని బంధాలు
యెన్ని సంబారాలు !
ఆలి కళ్ళల్లోని
సెల్లి ఋుణాలు !
ఏ జనమ పున్నెవోం
ఏ యేల కాయాల
ఆలి వోయినం లోని
తల్లి పేణాలు !
తమ్ముడో నేనంటు
తలపాగ సుట్టింది !
కన్నీలు తుడిసింది
కావలించింది !

---

# విందు

ఆంధ్రాలో అడుగు పెడుతూ
కాంచిన వంటకాల దృశ్యాలా
వేపు శనక్కాయల తంపటి
ఊచ బియ్యం వేపే కుంపటి !
రేకుల్లాగి కాల్చుకున్న
మొక్క జొన్న గుండెలు !
గాల్లో మసాల కలిపే
చేల్లో కొతిమేర మండలు !
కంది కొమ్మ శనగ రెమ్మ
తంపటి కమ్మున దూర్చి
ఆఖరి గింజ కోసం
అందరం బూడిద చెలిగాం !
దోసకాయ దొప్పల్లో
మేక పాలు పితికారు
ఆంధ్రా ఫలహారశాల్లో
పదార్థాలు అమూల్యాలు !

# కాపలా



చొక్కా లేదు నా వొంటికి
కాపలా యెందుకీ పంటకి
అటుపోతే నక్కల బాడవ
ఇటుపోతే కుక్కల నడవ !
కాలికింద పొసగనంట
పుచ్చకాయ బెసుకు తుంటె
కిందపడితే కుట్టు కళ్లు
ఎర్ర బార మిరప్పళ్ళు !
పరుగు పడితే గుంటెలు
చెందు తుండు కండెలు !
ఎదురు కొట్టు బడవల
గుమ్మడికాయ కడవలు !
లక్ష్మొచ్చిందీ మధ్యనె
నాట్యం చేయటానికి !
పాము లొస్తయి రోజూ
పిలుచుకు పోవటానికి !



# గాలి ఉయ్యాల



మంచెపైనా మనకు
జాబిల్లి దిండంది !
సుక్కలన్నీ దూసి
పక్కేసి నాది !
ఈ రేయి నాదంది
గుండె తడిపింది !
గాలి వుయ్యాల్లోన
ఊగి పోయింది !
కారు పిల్లఁరిసింది
గుండె కరిసింది !
ఈ రేయి నీదంది
పలుకో మంది !
కారు పిల్లఁరిసింది
మూగు పిల్లరిసింది !
తొలికోడి కూసింది
శంప కరిసింది !



## జలకాలాట

సుక్క దూకిందంట
అప్పుడే అనుకొన్న
యిక్కడుండా యని
ఇప్పుడే కనుగొన్న !
సెర్లోకి దిగిరావు
సుక్కలెంతా సేపు
సూసి పోదావంట
సక్కనీ సుక్కల్ని !
ఇటు కేసి వొస్తాదో ?
నింగి నేలకు వొంగి
సందకాడా యాడో
యెతుకు తుండాది !
గాలి గుసగుస మంది
సెట్టు వొణుకుతా వుంది !
సిన్న మొగ వేసుకొని
సెంద్రుడే తగలడితె !



# ఎండమావులు

సజ్జసేలో మధ్య

మంచె పిచ్చిక గూడు

కథ సెప్పు తున్నది

కన్నుల్లో సిన్నది !

కలువగిన్నెల్లోని

మధువొలికి పోయె

సేనంత ! గల్లంతు

ఆ వెంట ఆబోతు !

లేడల్లె ఆడది

దడుసు కున్నాది !

గుండె కల కేసింది

వీపు తట్టింది !

రేయి రేయి తాను

పలవరించింది !

సేతులే కావంది

బతి మాలుతోంది !



# మూగ బాధ

సెలయేటి గల గలల
సొమ్మసిల్లే కొండ !
యేటి బొడ్డే బీడు
యెన్నో పిట్టలు పాడు !
కొసిరి కొసిరీ తాను
ఉసురుసురు మంటుంటె
గుండె కొట్టుకు లాడు
యెద్దు గట్టుకు సూడ !
యెద్దు సూసే దట్ట
యెరిక సేయా నంట
మూగ బిడ్డల ఋణావుఁ
గడ్డితో తీరేన !
దారి నొచ్చే యేల
దొంగలల్లే సూసె
రైక సినిగిందని
పైట సూపిందేవోఁ !

# కంటకాలు

గుడిశలో పస్తులుంటూ
వడిశాల తిప్పుతున్నావా తల్లీ !
అలనాడు నా పురిటికి నీచేయి
నెయ్యికారిందట జ్ఞాపకముందామ్మా ?
ఈనాడు ఆకలికి
నకనక లాడుతుంటే
తింటానికి ఎలుకతే
నయమంటున్నారు తల్లీ !
ఎందుకమ్మా ? అలా ఆకలితో
మెలికలు తిరుగుతావు ?
తాగెయ్ తల్లీ ! మబ్బులిచ్చే నీళ్ళన్నీ !
సముద్రంలోకి చుక్క పోకుండా !
ఆనాడు చూడు నన్ను
విశ్వమానవుడిగా యెదిగి
ఆకాశం మూకుడు చేసి
నిరతాన్నదానం చేస్తానేమో ?

---

# వర్షాభావం



నీరసంగా వూరు పడుంది
కుక్కలైనా యేడుస్తుంటే
ఎవరికి పుట్టిన బిడ్డో ?
నాలుక కొరుక్కుంటోంది !
ఏదో వొక మబ్బుతునక
ఇటు కేసీ వచ్చుదనుక
దాహాలు తీర్చేనని
మొహాలు మాడ్చుకొని !
ఇంకెవరూ ? భగీరథులు !
తప్పిక తీరని రైతులు
లంకా పట్టణానికి
వారధి కట్టిన కోతులు !
ఎవడైనా వున్నాడా ?
ఎవడున్నాడీ నాడు ?
పాతాళ గంగ మీదికి
యుద్ధం ప్రకటించేందుకి !

---

# కాలజ్ఞానం



కాకి గూడల్లింది
గోరింక పొదిగింది !
కొంతకాలం ఆగు
వాన వెనకాడేను !
గండు చీమలదాడి
కాళ్ళకిం దెళ్ళాలి !
తలపైన తుమ్మెదలు
దండుగా యెగరాలి !
బెడగొండలో మొయిలు
నాలుకలు కోరాలి !
ఇంద్రధనసున నారి
వరదలై పారాలి !
ఆకాశమే కప్పు
లేదు మనకే. ముప్పు !
ఉన్నదంతా మనది
పంచుకుందాము !



# కలుపుబొట్టు

గొడ్డు వచ్చిన వేళ
బిడ్డ వచ్చిన వేళ
కల వొచ్చినట్టుగా
కలిసి రావాలా !

పాల నివ్వని యావు
పాడవ నొచ్చే కోడె
కొత్త కోడలి చూసి
మెత్త బడ్డాయి !

మా యింట చిన్నది
నడయాడుతున్నది !
సిరులు మా యింటికే
తరలినట్టున్నది !

దోరావు కొన్నపుడు
కరువు తప్పింది !
తొలి సారి కన్నపుడు
కాలువలు పడ్డాయి !



# సాగర దర్శనం



సాలీడు అల్లాఁడు
మానోసట గూడు !
చించు కొ స్తున్నాడు
సాగరుడు నేడు !
కోడైన కూయలా
వడిగాలి వీడలా
నెత్తెనెత్తెకు పాకి
నీటి బుగ్గయినాడు !
మబ్బుల్లో మెరుపేది ?
ఉరుముల్ల అరుపేది ?
చూడ చిత్రం గుండు
భానుడికి తేడా !
గుడిలోని శంకరుడు
మానవుడు కాడు !
మడిలోని సాగరుడు
దేవు డయినాడు !

## కుశలోపరి

నాగార్జునుడు నిన్ను
చూడ నంపాడా ?
కన్నీళ్లు తుడవగా
సాగ నంపాడా ?
చూడు !సాగర !చూడు !
ఆవు ముట్టదు నీరు !
పీడకలగా గతము
పొడగట్టు తున్నదో ?
గొంతు కెండిన దూడ
కొన ప్రాణముల తోడ
చెయ్యి నాకిన రైతు
గుండె పగిలిన రీతి !
తప్పిపోయిన చావు
కడుపు కాలిన గోవు !
ఆగు ! సాగర ! ఆగు !
పొలమారు తుందేమొ !

# కార్యసౌఖ్యం

పాట్లు తొలిగేనోయి

నాట్లు వొచ్చాయి !

మొక్కల్ని నాటండి

ఉగ్గు పోయండి !

సురులు అసురులు కలిసి

సాగరం చిలికారు

మానవుల మరచారు

స్వార్థ మెంచారు !

తిన మరిగిన మొద్దు

త్యాగ మెరిగేనా ?

కడుపు కాలిన గోవు

బిచ్చ మడిగేనా ?

సిగ్గెందుకూ యింక

ఎగ్గెందు కోయి ?

చిక్కాలు పెడదాము

పగ్గాలు పడదాము !

# దొడ్డ బ్రతుకు



వందకి యెనభై మంది

భారతంలో రైతు పైన

ఆధారపడి బ్రతికేది

అతడు చెడితే చితికేది !

అందుకే ముందుగా

కాలువలు త్రవ్వాలి

రైతుకు రెండు పంటల

అవకాశం యివ్వాలి !

రైతు కెప్పుడూ

పని కల్పించేది నీరు

అతని కప్పుడే

కావలసింది పనివారు !

చక్రమిలా తిరుగుతుంటే

సక్రమంగా వుంటుందేమో ?

ఆలో చించండోసారి

అంతా కలిసినప్పుడీ సారి !



# సాగరా! లయం

సాగరా ! లయమంటె
ఎవడు కాదంటాడు ?
సత్రమైనా దంటె
కడుపుమంటే కాద ?
వాన పడ లేదన్న
పిల్లి పాయిలోవున్న
తాలూకా వాడొచ్చి
తలుపూడ పీకాడు !
పూజారి నిదరోతె
వార వోసీ రుధిర
బిందు బిందువు నేదో
కుక్క నాకిందేమో ?
మూడు వూపిరి పెట్టి
నీదు కోవెల కట్టి
నీ గుడికి పగులంటె
దిగు లెవడికో నంట !



# కాలగర్భం

మట్టిగడ్డ రైతు బిడ్డ
గుండె కాదుటోయ్ !
ఆ గుండె పగిలినపుడు
పచ్చి పుండు కాదుటోయ్ !
నిప్పులు చెరిగే గాలిన
లేగ దూళ్ళు మాడెనే !
పాల చుక్క యింకిపోయి
పసిపాపలు వ్రాడెనే !
కసిరికొట్టి ముసురు పట్టి
చంటి బిడ్లు చావబెడ్లు
డొక్కల్లో ముట్టె లెట్టి
ఆకల్నే పొదిగెనే !
ఆకురాలి మోడు తేలి
చిగురు వేసి కాయ కాసి
నోటికాడ పెట్టుకుంటె
పండంతా పుచ్చెనే !

---

# చరిత్ర



ఎప్పటిదో యీ ధరిత్రి
అప్పటిదీ నా చరిత్ర !
యుగాదిగా నాగలి నాది
అనాదిగా మిగిలిన సోది !
అమ్ముకున్నానా ?
నమ్ముకున్నానే !
బాధలు కాల రాచినా
వరదలు నేల తొలిచినా !
పుచ్చుకున్నానా ?
ఇచ్చుకున్నానే !
ఆరుగాలమూ కోరికి నా బలం
తేరగానే అందరికీ ఫలం !
గుళ్లో గొల్లాడిలా
బళ్లో పిల్లాడిలా
బ్రతుకీడుస్తున్నాను
ఎద పీడిస్తున్నాను !

# వేషాలు



ఎద్దన్నా ! వద్దన్నా
పరు గెత్తా వద్దు
నింపాది గెల్దాము !
నీళ్లే తాగేద్దాము !
గంతమూ పునవేసి
గంగి రెద్దును చేసి
బంగారు నీ బ్రతుకు
బజారు కీడ్చారు !
ఎంగిలి చేత్తో కాకిని
తోలకుండ చస్తాడు
అన్న దాతవు నీవు
వాడికి ఆబోతువా ?
ఏక పత్నీ వ్రతుడు
దేవుడు అన్నారు !
రాముడికే నిన్నొదిలి
రంకు నేర్పు తున్నారు !



# గణన



వస్తుంది ! వస్తుంది !
ఒక్క రోజొస్తుంది !
కాడి గట్టే వాడి
జాడ గుర్తొస్తుంది !
వస్తుంది ! వస్తుంది !
ఒక్క రోజొస్తుంది !
మేడి పట్టిన వాడి
గూడ గుర్తొస్తుంది !
వస్తుంది ! వస్తుంది !
ఒక్క రోజొస్తుంది !
ఎద్దు తోలే వాడి
బుద్ధి గుర్తొస్తుంది !
వస్తుంది ! వస్తుంది !
లోక మంతా వెదికి
నేల దున్నేవాడి
నీడకే వస్తుంది !



# వాన ముందే వరద



పట్ట పగలే మేఘాలు
నల్లటి పెను గొండల్లా
చీకటి కడు తున్నాయి
పరుగులు పెడు తున్నాయి !
చుట్టూతా జొన్న చేలు
చూపు మేర కున్నాయి !
పసరు వాసన లీస్తూ
పరగణాని యేల్తూ !
హోరు గాలికి పైరు
అలలుగా పరుగేస్తూంది !
పరగణా పరగణా
సాగరంలా తోస్తూంది !
మామిడి తోట వొక్కటే
మధ్యలో తేల్తూంది !
పంచాంగంలో కుంభ వృష్టి
ఎప్పుడలివొతుందీ సృష్టి ?



# పూలమాల



సాతి కొంగల బారు
శాంతాకులా వుంది !
ఆకాశమే మాల
అల్లు తున్నాదో !
మాల తెగిన లీల
ధరణికే ఆ పూలు
పచ్చ పచ్చని చేల
అక్కడక్కడ రాలు !
దోసిళ్ళతో చేలు
బంతు లాడాయె
విసిగి విసిగీ పూలు
ఎగిసి పోతున్నాయి !
మేఘాల కురులలో
మాల తురిమిందేమొ
దిష్టి తీయగ సంధ్య
ఎఱ్ఱ నీళ్ళను కలుపు !



# ఆత్మవంచన

చేలో కెక్కటంలా నీళ్లు
అలాగే వున్నయి బీళ్ళు
వస్తూనే వుంది వరద
పోవటంలేదు బురద !
అందరూ ఆసాములే
ఉన్నది శాసన సభలో
ఉంటారు అయిదేళ్లెల్లా
బెల్లం కొట్టిన రాళ్లల్లా !
ఎప్పుడైతే శాసన సభ్యులు
పుచ్చుకున్నారో జీతాలు
అప్పుడే అయిపోయారు
నిజంగా వుద్యోగులు !
మధ్యలో వుద్యోగిని
విధి నెరవేర్చక పోతే
దించడానికి హక్కు
ఎప్పుడాసామికి చిక్కు !



# దైవాధీనం

రండీ ! రండీ !

సూడండీ గుడిశని

అందులో వుండే

మడిసిని !

అదుగో ! అదుగో !

అక్కడ !

కూసుంటాడు

ఒక్కడే !

కష్టపడతన్నాడు

ఇష్టపడతన్నాడు !

నిచ్చముా గడ్డే

పచ్చముా గొడ్డు !

ఇదుగో ! ఇదుగో !

ఇక్కడ !

వానచేతిలో

చిక్కడి !

# పిట్టపోరు



కుటుంబంలో పెద్ద కొడుకు
కర్రపెత్తన పుచ్చుకొని
చూపినట్టు కర్రెత్తం
ఏలుతుంది ప్రభుత్వం !
ఆ పక్కన కాలవకి
బాగానే గండడింది !
చూస్తూ వుండగానే
చాలా పారగొట్టిందే !
ప్రతిపక్షం శిస్తాసూలుకు
హక్కేదని అడుగుతంది ?
ప్రభుత్వంపై ఖర్చుకు
డబ్బేదని గొణుగుతంది !
వ్యాజ్యం పడిందంట
తెగేదాక వుంటే ఎట్ట ?
పదండి పూడ్చుకుందాం
రైతుదే రాజ్య మందాం !

# తత్వం

ఎద్దొకటి దున్నొకటి
జత కలవ లేదు
కలగలపు కూడు లే
ఆ కడుపు గోడు !
దున్న అంకేసింది
ఎద్దు రంకేసింది !
గీకలేడే తల్లి
భూదేవి నీవొళ్లు !
అమ్మలేని బరువు
కొనలేని అరువు
ఒకదానితో దున్న
తెర వేమిటమ్మా ?
ఎద్దునెక్కె శివుడు
దున్ననెక్కె యముడు
రెంటి నెక్కినవాడు
వీడెంతటోడు !

# సిగపట్లు

మనము మనుషుల మేన ?
మట్టి బొమ్మల మేన ?
నిప్పెట్టినారు రో
దేశానికో యన్న !
అమ్మనమ్మేవాడు
ఆలి కొనేవాడు
ఎఱ్ఱకోటలో చేరి
ఏలుతున్నాడు !
ఉన్నోడు అన్నాడు
లేనోడు అన్నాడు
జుట్లుముడి వేసి
మనబట్లు కొట్టేశాడు !
అమ్మబోతే అలుసు
కొనబోతె తెలుసురా !
దళారి దోపిడీ
ఈ ముండ మేలుబడి !



# రైతు పంచాంగం

వేసవనే శకునం
పాలేరు లేవలా !
పెట్టాడు నాగా
చుట్టాను పాగా !
పొద్దున్నే కుస్తీ
ఆఖరు కిస్తీ !
శిస్తు అదనం
ఏదో కథనం !
మధ్యాన్నం నూర్పిడి
ఏమిటీ దోపిడి ?
ఎకరా ముప్పైఎరాలినా
నికరం పాతికేనా !
సాయంత్రం వార్త
ధర తరిగింది !
అర్థరాత్రి కల
లాభనష్టాల వల !

# ఖానీలు

అతి పెద్ద సోపంట
ఈ భూమిపై మనది !
అమెరికా అన్దంట !
రష్యా విన్దంట !
బుఱ్ఱకో ఓటుంది
గొఱ్ఱెకో ఓటు !
బఱ్ఱెకో ఓటుంది
జుఱ్ఱుకో ఓటు !
అమెరికా అంటేను
గరికంటదీ గొఱ్ఱె !
రష్యా అంటేను
రహాశమంటది బఱ్ఱె !
వినాయకుల చేతి
అమాయకులార !
ఇదికాదురా ఓటు
తిప్పికొట్టె ఈటె !

---

# పరిహాసం

కోటి విద్దెల పాడవు
కొండ్ర వేశానంటు
నెత్తి కెక్కిన పొద్దు
పోద్దాలు పోవాల !
సుత్తి నెత్తినవాడు
నెత్తినే మొత్తుకొనె !
ఎద్దు నెక్కినవాడు
ఎల్లికిల పడ్డాడు !
హాలము పట్టినవాడు
కాడి కిందేశాడు !
కలము పట్టినవాడు
ఊసైన పలికాడ ?
కోటి విద్యలు కూడ
కూటికే నంటారు
కూడెట్ట పుట్టేనో
ఒక్కడికి గుర్తుందా ?

---

# వేరు

డొంక తిరిగేకాడ
మావిచెట్టూ నీడ
రైతులందరు చేరి
తింటాడు తిళ్లు!
ఎండలో ముసలాడు
పోరాడు తున్నాడు!
చెట్టునీడకు రాడు
అసలు కూడే తేడు!
ఎదిగొచ్చి కొడుకులు
వేరుపడి పోయారు!
ముసలాడి ఆలికి
కాలు పడి పోయింది!
ఒక్కయిల్లే పగిలి
ముక్కలన్నీ మిగిలి
దేశమే అయ్యింది
దారిలేకా వుంది!

# స్వయంకృతాలు

డొంక దున్నేశాడు
దారి లేదన్నాడు !
కాళ్ళు నెత్తినపెట్టి
చేని కొస్తున్నాడ?
వల్లకాడే కలిపి
వల్లగా దన్నాడు !
ఊరకుక్కలు వాణ్ణి
పీక్కు తినాలా ?
వనాలు నరికారు
వాన లే దన్నారు !
వన మహోత్సవా లంట
ఊళ్ళు అడవులు సేయ !
ఉన్న కొమ్మే నరికె
దున్నపోతూ పనులు !
ఎన్నాళ్ళు సాగురా
విన్నన్న వాదాలు ?



# పాలపుంత



సరిగంచుల పంచపైన
అరచేతుల చొక్కాతో
చేతిలోన కఱ్ఱ పట్టి
నిండుగ నే నడిచేను !
వీప్పైన తుపాకిలా
వెనకెవరో గోణిగారు !
ఎలావుంది వీడి చేను
నిరుటిలాగ ఏడిశిందఁ ?
కంకిగుత్తి కండెపొత్తి
మచ్చుకు నే తెస్తుంటే
మళ్లంటుందా గొంతే
ఇలావుంద చేనంతా !
జొన్నపొత్తి కంకిగుత్తి
పందిట్లో యాలగట్టి
దూడ నాకు చూడనావు
సందిట్లో జున్నుగడ్డ !



## హద్దులు

బంగారమూ మట్టి
బతుకు యింతేనా ?
బరువైన పరువైన
బ్రతుకు మనకొద్దా ?
గట్టు కేసిన రాయి
మనకు పోలేరమ్మ !
రిత్తవై పీకావా
మిత్తవై మింగేను !
వామి యెత్తును చూసి
గోమాత పులకించి
తన లేగదూడతో
ఊసులే పలికేను !
వామి తగలెట్టావా
గో వుసురు కొట్టేను !
రాత గీసినవాడు
మేత వేయక పోడు !

---

# నాగరిక లక్షణం

వంటినిండ కండలుండీ

కంటినిండ పండుకుంటె

బలమంతా యీడుబోద ?

బ్రతుకంతా పాడుగాద ?

ఉత్తిగానె పడుకుంటె

కొత్తకలలు వొస్తాయి !

అడ్డదారి వెతికేడు

దొడ్డిదారి పట్టేడు !

పగలంతా కష్టపడితె

రేయంతా నష్టపడదు !

కండలన్ని కరిగిపోయి

గుండెల్ని విసురుతాయి !

కష్టంతో గూడుకట్టు

పట్టుమెంత దీనికింద ?

వదలగొట్ట వస్తాడు

తగలబెట్ట చూస్తాడు !

---

# ఆదర్శం



గోతాము పడుతుంటె

ఊపి తెలతా వుంది !

కసరత్తు అనుకుంటె

గమ్మత్తుగా లేద ?

ప్రతి మనిషికీ రోజు

కసరత్తు కావాలి !

కష్టమను కున్నది

కసరత్తునే కాద ?

పొద్దు బారెక్కింది

సద్ది వస్తా వుంది !

పిడికెడేసీ కుడుము

పుట్టకొక్కుల కూర!

కర్మసాక్షీ చూడు

నిత్యమూ వస్తాడు !

అలిశాడ ? పులిశాడ !

అరిగి పోయాడా ?



# రైతు రాజ్యం

నా దొక స్వర్గం
దూరం కాదు ద్వారం
తపస్సు కావాలన్నా !
కష్టమని నే నన్ను !
దానికి రాజును నేనే !
రైతుని నే నన్ను !
మంత్రొక డున్నాడు
జీతగాడని నే నన్ను !
యుద్ధం యెప్పుడూ వుంది
సేద్యమని నే నన్ను !
సైన్యం కూడా వుంది
కూలీలని నే నన్ను !
నా స్వర్గంలో
స్వేచ్ఛ మహో బరువు !
నా దుర్గంలో
దాస్యం బహు కరువు !

# పరిష్కారం



రచ్చ బండకు రండి
రగడ తేలుద్దాము !
మనసుండగా మనకు
మార్గమే లేకుంద ?
కూలైన రైతైన
కొదవ లేకుండాల
వృత్తి మన కేదైన
కొంత మిగలాల !
ఉన్న వాడొక నాడు
లేని వాడేగా !
లేని వాడొక నాడు
ఉన్న వాడేగా !
కలిమి కోసం మనం
కష్ట పడదాము !
హెచ్చు తగ్గులు వస్తె
ఆంక్ష పెడదాము !



# పోకిళ్లు



ఎల్లెద్దు పుల్లెద్దు
గిల్లి కజ్జా లాడు !
అల్లంత దూరము
గల్లంతుగా మొగురు !
దూరాన నను చూసి
దరువంత మార్చేరు !
ఒకరి కొకరూ వారు
గీరు కుంటున్నట్లు !
ఏమిటీ వరసంటు
నవ్వు కుంటూ వుంటె
చంటి బిడ్డల మల్లె
చంక కొచ్చేస్తారు !
మట్టినే దున్నేరు
మాగాని చేసేరు !
చర్మ మొలిసీ మనకు
చెప్పులే కుట్టేరు !



# జతగాడు

జీతగా డెవడురా ?

జతగాడురా వాడు !

జీవితానికి తోడు

త్యాగానికీ యీడు !

అతడు తోలే యెద్దు

తోక జాడించినా

కాడి మెడ నేసుకోని

నాగ లీడుస్తాడు !

దొర గారు వాడంటె

దుర దెత్తి పోతున్న !

'బాబయ్య' వాడంటె

బరువెత్తి పోతున్న !

పెద్ద కొడు కంటూను

ముద్దెట్టు కుంటూ !

జ్యేష్ట భాగం యిచ్చి

జోగొట్టు కుంటూ !

---

# వేదాంతం

రెక్కాడితే గాని
డొక్కాడ దోయి !
చిక్కు పెడితే గాని
చక్కబడ దోయి !
బంగార మెవ డైన
అరిగించు కున్నాడ ?
డబ్బు తిని యెవ డైన
ధరణి యేలాండా ?
తెలియకే వాడెవడో
విలువ గట్టాండు !
ఆకలంటే జీవి
ఆయువే నోయి !
పంచ భూతము లన్ని
ప్రాణి కవసరము !
ఆరవ భూతమ్ము
ఆహార మేరా !

# తీర్పు



ఎద్దుల్లారా ! ముద్దుల్లారా !
దూతల్లారా ! దాతల్లారా !

దూకండి వడిగా
సాకండి జనులా !
సోమరి పోతుకు
సంఘ ద్రోహికి
గడ్డెయ్యా లండీ !
మీకు యిడ్లీ లడ్లండీ !
సమ్మెకు పోరు
చట్టం తేరు !
మీరే ఘనులండీ !
మా పనులే వేరండీ !
మాటలు నేర్పి
మనిషిని గూర్చి
తీర్పింమ్మంటే
మీరే మంటారో ?

# పిలుపు



కూలీలు ! పాలేళ్ళు !

రండి ! రండి ! వురికి !

ఏదీ మన వునికి ?

రండి ! రండి ! పనికి !

ఎవ్వారిదీ పాపం ?

ఎక్కడుందీ లోపం ?

మానవుడి బుద్ధి లోనా ?

వాడెక్కిన గద్దె లోనా ?

కిరాయి గుండె

పరాయి తిండి

వద్దు వద్దు

అద్దె బతుకు !

గుర్తు లేద చేతి లోది ?

ఆయుధం ! వజ్రాయుధం !

నీతికీ ప్రగతికీ

నిల బడదాం ! కల బడదాం !



## కాకమ్మ కథ



మనుషుల తత్వం
మానవత్వం
మనసులు విరిసిన
మాధుర్యంరా !
హద్దులు వేసి
కొద్దిది చేసి
అమ్మకోను
సొమ్ము కాదోయ్ !
త్యాగం ఒక
రోగం అయితే
మనిషికి మన
సెందుకుందో ?
ఆహారం
చూసిన కాకి
అందరినీ
కేc కే స్తుందోయ్ !



## పాల గుండెలు

పొలిమే రావల
కరువును తోలి
ఎద్దులతో ఆడుకుంట
హద్దు లేక పాడు కుంట !

పాతాళ గంగ
పై కుబ కంగ
మబ్బు లన్ని గింజు కుంటు
ఆకల్ని నంజు కుంట !

ఇది పురిటి గడ్డ
నేను రైతు బిడ్డ
నేల గుండెలా కొండలు
పాల కుండలా గుండెలు !

అదో భూదేవి
నిదర బోత్తో
చను కట్టు ముడి
సల్లగ విప్పు కుంట !

# ఇల్లాలి కలిమి

మేడయితే మాటు కేమి ?

అంతస్తు లయితేమి ?

ఎండ పడతా వుండు

నీడ మొడతా వుండు !

అక్కడే పెరగాలి

కొత్తిమేర గోంగూర

కాంబేజి కాలిపువ్వు !

మెంతాకు యెంతైన !

పూలు కావాలన్న

ఊలు తేవాలన్న

ఇల్లాలి మనసులో

కూరలే మిన్న

కనలేని కొలువులు

ఎనలేని విలువలు

పెట్టెలో పెట్టెయిన

మట్టి కివ్వాలి !

# బారెడు బిడ్డ

అరువైన అరుదైన
ఎరు వేసుకున్నాను
నెత్తురే తాపాను
పైరు సాకాను !
పిండి వెన్నెల వేయు
మంచు తడిపింది
వాన నీళ్లోసింది
ఎండ తుడిచింది !
ఒంటిలో శక్తంత
కుదగట్టుకున్నాను
ఇంటిలో సొమ్మెల్ల
ఎద పెట్టుకున్నాను !
కొడవ లంతై కంకి
పాలు పడతా వుంది
సంద్రాన తుఫాను
కాలు పెడతా వుంది !

# ఇంటి సోకు

నిత్య కళ్యాణమ్ము

పచ్చ తోరణము !

కాదటోయి యింటి

ప్రతి ప్రాంగణమ్ము !

పచ్చగా గడ్డల్ల

పెట్టు కుంటావే !

గడ్డి దేముందోయి

గొడ్డు బోత్తై తే ?

సొర పక్కనా బీర

బచ్చ లెమ్మట బెండ

ఇంటి పందిటి గుంజ

దొండ తొడగాల !

చేనులో యిల్లుందా ?

ఇంటిలో చేనుందా

అంతు లేకుండాల

అక్కడే వుండాల !



# గో పూ జ

బండిలో ఇల్లాలు
పురుగు పొంగలి సేలో
పెట్ట బోతం దంట
యడ్ల గుస గుసలు !
కళ్ళు సాలవు సూడ
సిన్నోడి పెళ్ళాన్ని
రాసోరి బిడ్డంది
ఊరు మురిసింది !
పాలిగాడి కేకలో
భూం దేవి మేలు కొని
సిరు లొలుకు నవ్వుల
పలక రిస్తోంది !
పతాణపు చీర
జీరాడ పూబోణి
చేత పళ్లెర మూన
గో మాత పరుగెత్తె !

# సాల భంజికలు

చుట్ట కాల్చుకుంటూ నే

చెట్టు కింద కూచుంటే

ఏనుగులు మేస్తున్నట్టే

ఎదురుగా వున్నై కొండలు !

ఆ పక్కన పిల్లాడు

పిట్టలు తోల్తున్నాడు

వడిశాల్తో రక రకాల

కేకల్రువ్వు తున్నాడు !

పోట్ల గిత్త లీ పక్కన

కుస్తీల్పడు తున్నాయి !

ముసిలివి బీటిలో

ఉసి కొల్పు తున్నాయి !

జడ్డిగం కొప్పెట్టి

జొన్న కర్ర ఆడతంది !

చేతిలో కొడవ లెత్తి

పల్లె పడుచు పాడతంది !

# గడ్డు ప్రసూతి

ముందు కెలితే రాదు
వెను దిరిగితే పోదు
ఉయ్యాల వూపింది
దయ్యాల కొండ !
ఉరుముకే దడుసుకునె
కొంగలకు లొంగునా ?
వంక వంకల డొంక
చేల కడ్డం పడగ !
మెరుపు కాలిందేమొ
గాలి చిందే సింది !
మబ్బు తడిపిం దంటె
బొబ్బ లెక్కె నంట !
ఈత కొచ్చిన పైరు
లేత పడుచుకు మల్లె
చే నెల్ల తన్ను కొన
మానల్లె నిలుచున్న !

---

# ప్రస్థానం

కిందుండే అందుకొచ్చి
కొబ్బరి రొమ్ములు !
చూస్తోంది మిరప
బటాని గుడ్లతో !
కండె గడ్డం మూరెడు
అరటి జడ బారెడు !
పల్లి కంత చావంచి
నేల కొప్పున కాలి పువ్వు !
పొదుగుడు కోడిలా
ఆకుల ఈకల్లోకి
నేల్ని తాకే కాయల్ని
లాక్కుంది మామిడి !
వెంపలి చెట్టుకు
నిచ్చన వేసినట్టు
మనసుంటే యిట్టే
ఎక్కొచ్చు ఒక్కో మెట్టు !

# పసిడి దృశ్యం

చేల వంకా చూడ

ఆక లవటం లేదు

ఇంటి వంకా చూడ

వెళ్ల బుద్ధవటంలా !

ఆ వంతునే వుండి

పస్తు లైనా పండి

చేలపై నా యాగ

వాల నీ కుండాలి !

చెఱువు గట్టెక్కాను

చేలపై చూశాను

చేలన్ని పసిడీని

తల లొంచినాయి !

బారు బారచ్చులుగ

దారులే కోశాయి

బరువెంత తూగిందో

ధరణికే తెలిసుంది !

# నవ్వులాట

నూరిపిడి దిగ బడది
కదల శెద్దుల్లార !
సూరీడు వొచ్చేడు
సురక వేసేడు !
ఒచ్చేడు కరువంట
పంచాంగ దాసరి
మాది గింటికి తోల !
కదల కున్నా రేల ?
కిఱ్ఱు చెప్పులు నాకు
తోలు కుచ్చులు మీకు
మాట తప్పొద్దంట
తెచ్చె పెద్దింటోడు !
ఎన్ని కడుపులు మాడొ ?
ఎంద రుడుపులు పీడొ ?
నవ్వు కుంటా రేల ?
రాశి రెండింతలా ?

---

# సంక్రాంతి

సంక్రాంతి వచ్చింది
చే లోనె వుంది !
ఇంటికీ రానంట
చలి గాసు కుంట !
నిలు వెల్ల నను చూసి
తెల్ల బోయింది !
అరిగి పోయిన చేతి
మురుగు తీమంది !
బారెడంతా బిడ్డ
బతికానను చూడు !
పురిటి వాసన పోల
ఊ రేలనంది ?
వంట లెందుకు నాకు
పంట నే నంది !
గొబ్బిళ్లు తెమ్మంది
ముగ్గు చాలంది !

# అలవోక

నింగి పందిరి కింద
నేలంత అరుగు !
సీతమ్మ గుండెలో
రావఁయ్యా పరుగు !
యల్లెద్దు పుల్లెద్దు
రథ వెఁల్లతా వుంది !
సీత రావుఁల పెళ్లి
కథ సెప్పతా వుంది !
దారెంట శెట్లల్లో
పచ్చ లాల కించ !
వాన వోస గట్టంలో
గొంతు గీ బోయింది !
ఇద్దరం అడిగేది
ఒకటే రావఁయ్యా !
మా ఆయువులు కలిపి
సెరి సగవుఁ సెయ్యా !

# ఆత్మావలోకనం

పుస్కారాలకు మనవుఁ
పుర గోలుపు కెల్లాఁవుఁ !
పిండ వేఁ సేటపుడు
గండవైఁ నాది !
నేల రాలిన మొడ్డు
గుండెలో మోరెట్ట !
బేపనయ్యాకు వాటి
గోత్ర వేఁవఁని సెప్ప ?
కాటు వేసే పావుఁ
దేహా వేఁ దహానవాఁ ?
పాటు పడ్డా మొడ్డు ?
పుట్టె వాఁవుఁల పైన
గురుతు రాటం లేద
పెద్దావు గో మాత
అనుకుంట వూరంత
ఉరిపోసు కేడ్సింది ?

---

౧౧

# నిరీక్షణ

క్రిష్ణ లో ముని గేసి
కొండలా దండాలు !
ఇళ్ళపై యిళ్ళెక్కి
ఊరు సూత్తుండాది !
కాలువలు వారోసి
లోయ పెవిఁ దల్లోన
తోయముల హారతులు
సుప్రభాతాలు !
నిండు శూలాలమ్మ
నిలుసుంది క్రిష్ణమ్మ !
కాళ్లు కడగా లంట
దిగిరావ దుర్గమ్మ ?
కుంటి గుడ్డోళ్లంట !
కొండ సిగ యిల్లు దిగు !
సుట్టూత ప్రకృతి
సూడ ముచ్చట గుంట !



# ఎదలసొద



జవరాలి యెద లోని
మరులు యేరుకు తింట
పొన్న మానున జంట
పూలు రాలిన వంట !

సుక్కల్ని కళ్లట్టి
మంచమ్మై పడుకుంటె
గాజు లన్నీ మోగి
జల్లు మందనె వొళ్లు

ఆ వంక నెల వొంక
కుంటుతా పోతంటె
సుక్క లన్నీ పగిలి
ముక్కలైనా యంట !

ఆవు అరిసీ నట్టు
తాను వొచ్చీ నట్టె
తలుపు తెరిసీ నేను
తల్లడిలి పోయాను !

# నిరాశ

నేలకు వాల బడుతూ

నాలుక మెలి పెడుతూ

ఆవీన్తా వుంది ఆలస్యంగా

చావో! బ్రతుకో! సంశయంగా

ఉదయించే బిడ్డ

మన్నబోయే గడ్డ

కడుపులో బెణికి

గడగడా వణికె !

దూరంగా తీతువు

ఘోరంగా కూసింది !

మూడుసార్లు మొబ్బెట్టుగ

గుండె ఆగి పోయేట్టుగ !

ఆశ నిరాశామె !

ఏముంది స్థిరం ?

అంతా మాయ !

తీసి చూస్తే పెయ్య !



# బొమ్మలు



మేడి పట్టిన వాడి
టీవియే వోలీల
సాలు సాలుకు నేల
పులకరించే వేల !
నింగి గుండెలు కదిలి
మబ్బు బొమ్మలు మెదిలె
దేవతా శిలపాలు
మేగ సందేశాలు !
బొమ్మ బొమ్మకు నన్ను
సొమ్ము లడుగుత వుంటె
తనకు తగ్గా యెద్దు
అవి కళ్ళు మూసేవి !
శిలిపి బొమ్మలు యిట్ట
సూపాల అనబోతె
ఆ పక్క నొక బొమ్మ
నిత్తెం విందు కాదంట !

---

# నిర్వేద

సీకట్ల కురులలో
జాబిల్లి పువ్వా !
సీరం వెన్నెల జార
సూరీడు బొట్టూ !
ఇంద్ర పట్టం వూరు
కవితయే తన పేరు !
ప్రకృతి దాగుడు మూత
పుష్పావతై తాను !
సేల శంగుల మడిసి
పూల వాసన గాలి
వెదురు అందెల రవళి
యేటి గలగల మురళి !
మురళి రవళీ సరళి
ఆడు తుండది గుండె !
కొండ కన్నుల గుండ
సెలయేటి జలకారు !

---

## విశ్వఘోష

ఇంకెప్పుడు ఈ గడ్డన
పుడమికి నెల తప్పేది
పన్నీటిని చిలికేది
కన్నీటిని తుడిచేది ?
ఇంకెప్పుడు ఈ గడ్డన
ఒక నుయ్యి
ఒక పొయ్యి
వసుధైక కుటుంబకం ?
ఇంకెప్పుడు ఈ గడ్డన
శాంతి
కాంతి
సంక్రాంతి ?
ఎప్పుడైన
ఈ గడ్డకి
అట్టి శక్తి
పుట్టు రక్తి !



# నెమరు

ధరలు పెరగను లేదు
దమ్మిడికి పని లేదు !
ధాన్యమే అన్నిటికి
దర్జాగ జరిగేది !
పొలము పనులే కాదు
ఊరి పనులని లేదు
అన్న దమ్ములు కదులు
ఇరుగు పొరుగూ బదులు !
మెట్టివాడి పెళ్లి
ఊరికే పెళ్లిరా !
సదివింపు లంటేనె
సే బదులు గా లేద ?
కమ్మరి కి కుమ్మరి కి
సాకలి కి మంగలి కి
అన్నీ మిరాశీలె
నోటి మాటే పూసి !



# పాలకులారా !

పెజలె పాలకులకు

బిడ్డ లంటారు

పాలకులె పెజలకు

తండ్రు లవుతారు !

పిట్టకే వొక తండ్రి

తొడ కోసి యిచ్చాఁడు !

తండ్రికై వొక బిడ్డ

అడివి కెల్లాఁడు !

తారు మారూ సూడ

మారు వేసము లేసి

తప్పు దిద్దే వోరు

తమ తప్పు లెరిగి !

తండ్రి శక్కరవరితి

బిడ్డ దరిద్దుఁడా ?

యేదైన వురికేర

ఇది కర్మ భూమిఁ !

# దోహూలారా!

కడుపు మంటా కొద్ది
ఏవింటో అన్నాను
బిడ్డ బిడ్డా తరవుం
కచ్చి పట్టా వొద్దు!
ఒకడి సామ్మూ ముట్టె
ఒక డాలిసీ పట్టె
మెంగిలి కూడది
గుండె సెపటం లేద?
మిమ్మనే పని లేదు
కాలవేఁ కలసిరా
దోహులే సంగమైఁ
హాక్కు లడిగేరు!
ఉరి శిచ్చ రద్దయిన
యే శిచ్చ పడినా
ఒక శిచ్చ వుండాది
అది అంతరాత్తము!

—

## కహా లీలా !



మనవుఁ మెలిగా వఁయ్యా
తండి బిడ్డల మల్లె
పస్తు లైనా పండి
పండగను కున్నావుఁ !
బంటి పోటూ అంటు
దొంగ పని యని నేను
సావు కారుకు సెప్పి
సే బదులు యిప్పిచ్చుఁ !
పంట లొచ్చే దాక
పనులు లే వంటేను
మనకు తగ్గా పనులు
కలిపించి బతికించుఁ!
అన్ని పనులూ సూరలె
సేసు కెలతా యంట
కాలు సేతులు రెండు
నరి కేసి నట్టేర !



# ఎద్దా !



మెట్ట బతికే వోణ్ణో
అడివిలో పట్టాను
నిన్ను శెడ గొట్టాను
నన్ను శమియించూ !
అడివి కెల్లొద్దింక
ఈడనే వుండూ !
అడివి మనిసై నరుడు
ఆడ సేరేడూ !
అమ్మ న్నుంచుతారు
నిన్ను తింటా రేవోఁ?
ఇట్టవుతా దనీ
నేను అనుకో లేదు !
పొగ బండి వొచ్చింది
పొలము దున్ను తోంది !
నా యింటి ముందు నువు
నందిగా వుండూ !



## ప్రేయసీ!

◆◆◆◆◆◆◆◆◆

గుండెలో తలదూర్చి
యేమిటా సింతా ?
నా కడుపులో యేదో
కదలాడు యింతా !
బిడ్డలూ బిడ్డలూ
యేమిటీ తంటా ?
మనవాళ్లతో మనవుఁ
ఆడుకో నంటా !
ముసిలోళ్ళ వైఁ నాక
యేమిటా ఆటా ?
సేయితాలై మనవుఁ
సేసినవి ఆటా !
తనివిఁ తీరా లేదు
ఇంతేన బతుకూ ?
జనమ జనమకు మనవుఁ
యింతేలె సాలా !

---

# కరం వేరు

నీ వెన్నెముక రా
నా పెన్ను !
నింపుతుంది సిరా
నా కన్ను !
పెట్టాను దానికి
నీ పేరు !
నీతోనే మారిందిగా
దాని తీరు !
చూశావా ?
నా గేద్రం !
చెరిపేశా !
"ఐంద్రం" !
ఇది వరకు పేరాది
చూసే వుంటావులే యిది !
పోతానంటే పోనిస్తానా ?
శాశ్వితంగా బ్రతికిస్తాను !



# ఊరడింపు



ఋణావుఁ లుంటాయంట
తీర్సు కోవాలంట !
మల్లి మల్లీ పుట్టి
యెల్లి పోతా మంట !
సిత్త విఁరిగీ పోతె
యిస్రిత మవుతాది !
యెద గూడు గట్టినా
సొద యెగిరి పోతాది !
కల్లోలమే పాటె ?
కలతలే శత కోటి !
పిన్న మనసూ మనది
పెన వేసుకుంటాది !
గుండె వూపున బండి
తోసు కెల్లాలంతె !
మల్లి మల్లీ పుట్టె
బంధవేఁ తెగుతాది !



# ప్రతిజ్ఞ



రెక్కలు ముక్కలు
డొక్కలు ఒక్కటై
మెతు క్కోసం
మేడే పడతా !
దొంగా తుంగా
ఋణమే వ్రణమై
బతు క్కోసం
బండే కడతా !
వర్షం వృషభం
కరువై బరువై
ఘర్మ జలం పారిస్తా !
నాగలి నే నీడుస్తా !
ధాత కరువుదే
డొక్క నవిఁలి నే
పుట్ట కొక్కులా
నిక్క బొడవలా ?

---

# ముఖప్రకటన

అశరీర వాణి

నా భాణి !

నిత్య కల్యాణి

నా మాగాణి !

ఎద్దు దేదో

పొడిచే వాణ్ణి !

పేడకళ్ళు

తుడిచే వాణ్ణి !

కరక్కాయ

గుండెకాయ

గొంతు కడ్డం

పడుతున్నాయ్ !

ఎందుకు

తపిస్తానో ?

ఎవణ్ణి

శపిస్తానో ?



శ్రీ హరనాథ్ ప్రెస్, 16/37 సత్యనారాయణపురం, గుడివాడ.

"ఇన్నాళ్ళకు శ్రీ నాగేశ్వరరావ్‌గారి "రైతు రాగం" చదువుతుంటే ఆ సత్కవుల సరసన సగర్వంగా నిలవదగిన రచన చేశారనే ఆనందమూ పాడటానికి అనువైన రచనా విన్యాసం. సంతృప్తీ కలుగుతున్నాయి. సులువైన మాటల్లో విలువైనభావాలు పలికించగల చాతుర్యం. పదకవితకు ప్రాణసమానమైన మాధుర్యం, సంయమవం. అల్పాక్షరాలతో అనల్పమైన శబ్దచిత్రాలను కళ్ళకు కట్టించే నైపుణ్యం".

—అమరేంద్ర